# శ్రీమద్భాగవత మహిమ.



మిన్నికంటి గురునాథశర్మ

# శ్రీమద్భాగవత మహిమ.

రచయిత:

ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ

మిన్నికంటి గురునాథశర్మ

(గుంటూరు హిందూ కాలేజి హైస్కూలు ప్రధానాంధ్ర పండితులు)

1952

హక్కులు: గ్రంథకర్తవి] [వెల: రు 1-8-0.

శ్రీరస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## విషయసూచిక.



ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ
మిన్నికంటి గురునాథశర్మ

# మనవి.

సోదరాంధ్రులారా!

శ్రీమద్భాగవత మాహాత్మ్యము పద్మపురాణోత్తరఖండమునఁ గలదు. సంస్కృతము రానివారికది యసంబోధము. కాన భగవదనుగ్రహమున దాని నాంధ్రీకరించితి. పూర్వులు త్రొక్కిన యనువాద పద్ధతి ననుసరించితి. అన్నియెడల మక్కికి మక్కిగాక కొన్నియెడలఁ బదము నుపలక్షించియుఁ గొన్నియెడల భావము పరికించియుఁ గొన్నియెడలఁ గ్రొత్తలు చేర్చియు దీనిని రచించితి. కథలలో స్వతంత్రించియు మూలోద్దిష్ట భావము చెడకుండ వ్రాసితి. వర్ణనలు స్వీయములే. మహిమానువర్ణనమున మాత్రము ప్రమాణబుద్ధికై మూలమును దొలఁగలేదు.

సప్తాహ యజ్ఞమున దినమున కెంతవఱకుఁ జదువవలయునో యది మూలమున లేదు. కాన శిష్టాచారము ననుసరించితి.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే...యథాంతరం నపశ్యామి" అని నిత్యము స్మరించుచు హరిహరుల కభేదంబను తత్త్వమెఱింగి నా గ్రంథము నాపరతత్త్వమున కొప్పగించితి.

తాము రచింపఁబూనుచు తెప్పించుకొనిన పుస్తకము నాకొసంగి వ్రాయ నాదేశించిరి, యోగవాసిష్ఠము నాంధ్రీకరించినవారు, పరమబ్రాహ్మణ్యులు, బ్రహ్మశ్రీ ముద్దూరి సాంబయ్యగారు. ఈనామిత్రుని మహోపకృతి చిరస్థాయి గదా. వారికి నాకై మోడ్పులెన్ని యర్పింపవలయునో. గ్రంథమచ్చుపడుట విలోకించిరి. సాదరముగ దీనఁ -అని "విభూతి" పెట్టి "భాగవత మహిమ"ము వెల్లడించిరి. శ్రీ సాహిత్యాచార్య, లాక్షణిక శిరోమణి, విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ- బ్రహ్మశ్రీ) జమ్ములమడక మాధవరామశర్మగారు - వారి సహృదయతకు మున్నమోవాకములు.

అనుగ్రహమున జదువుఁడు. గుణమున్న నానందింపుఁడు. లేదేని భగవత్స్మరణ ఫలము లభించును. కాలము దుర్వ్యయము చేయుట మాత్రము కాదు.

గుంటూరు
ఖర పుష్యకృష్ణనవమి

శర్మ.

# విభూతి.

శ్రీ మిన్నికంటి గురునాథ శర్మ గారు నియతిస్వీకృత భక్తి యుక్తులు, నియమారాధిత సారస్వతేయులు, ప్రకాశిత కవితా ప్రకాశులు, త్రిస్థోభయభాషా ప్రవీణ పరీక్షులు, శ్రీ కళ్యాణ దేశిక చరణ చరణ సీమాంత సమధిగత వేదాంత వారీణ పదాంకులు, ఆస్తిక బోధాసక్తులు. ఈ "భాగవత మహిమ" గ్రంథమును రచించిరి. ఇట్టి వారి కీకృతము సముచితము కదా! ఇది స్వతంత్ర కృతి కాదు. శ్రీ పద్మపురాణోత్తరఖండము లోని భాగవత మాహాత్మ్యప్రతిపాదక మగు నధ్యాయషట్కమున కను వాదము. అందలి శ్లోకసంఖ్య ౫౦౮. ఇందలి గద్య పద్య సంఖ్య ౭౧౫. అట నట కవి కూర్చిన కొన్ని వర్ణనము లధికములు. అది కవి కవితాసక్తి కొక ముక్క. గురునాథశర్మ సాత్వికుడగు భక్తుడు. మూలమున లేదని యూరకొన జాలడు, ఆ యా పట్టు ప్రఘట్టములలో నాగ్రిమమైన కవిచిత్త మట్లు చేయించక మానదు. ఈ మహిమ నా చేతి కందినది. హృదయమున కందుకొన్నది. నా భాగవతభావము భాగవత మహిమను భావింప జేసినది. నేనేమి చేయుదును! భావించితిని, సంస్కృతమును సంభావించితిని, ఇంకను పరిభావనము చేసితిని. ఒక యనుభూతి పొందితిని. తద్వ్యాప్తికై యీ విభూతిని సంతరించితిని. పాఠక ప్రభూతుల కిది ప్రముఖ సంభావ్యము కావలెనని కాంక్షింతును.

కవులకు దైవికావభాస ముండునని మనకు కతలలో కైతలలో మాత్రము తెలియును. మిన్నికంటి కవి కది యనుభవమున తెలిసినది. కవితాత్ముడు భక్తిభావుడగుట విశ్వసింతును. కవి లోకవిషయమున సందేహాను దర్యోగము. "దాని పిల్లవారు నమ్మకున్నను సత్యము చెప్పిన" (పుట 3.) వని చెప్పెను. కొంతయు చెప్పెను. మిన్నికంటి గురునాథశర్మ గారికి స్వప్న దర్శనము లభించినది. నందీశ్వర దివ్యదర్శనమును లభించెను. ఆనందమును లభించెను. పాఠకులకీ మహిమ లభించినది.

శ్రీ) ముద్దూరి సాంబయ్య గారు భక్తులు భావుకులు కవులును. వారు దీని తెలు ఆంధ్రీకరింప లేదు! అది చిత్రఘటనము వీరిట్లు చేయవలసి యున్నది. వారు చేయ లేదు. వీరు చేసిరి. నవమి కొక విశిష్టత యున్నది. అది కవికి అనుభూతిలో గోచరించినది. నవమి సంకల్పము. మాసములో

సిద్ధ మగునది. ఇట్టి శక్తివిశిష్టతలు వాఙ్మయములు కారాదు. కాని గురునాథ శర్మ కవి. కవు లూరకొనరు. బయలు చేసి కాని యూరట పొందరు.

కవి హరిహరనాథ భక్తుడు. తిక్కన సోమయాజి హరిహరనాథ ప్రష్టుడు. తిక్కన కవితాభిమానము గురునాథు నిట్లు చేసినదా? అయిన గావచ్చును. ఇంక నొకటియు గావచ్చును. "తీర్థంకరుల లోని పార్శ్వ నాథుని ఛాయలు హరిహరనాథునిలో నున్న" వని చరిత్రగులు తలచిన తలంతురు. తత్త్వజ్ఞు లిట్లును తలంతురు. ఆంధ్రబ్రాహ్మణులలో కొందరు కేవలధర్మమును కేవలబ్రహ్మమును గాక ధర్మబ్రహ్మ యోగ మవలంబించిరి. లోకాత్మ సంగ్రాహకు లయిరి. వారు నియోగి బ్రాహ్మణులు. ధర్మబ్రహ్మ యోగ సంప్రదాయము తిక్కనయజ్వ నాట నుండి సముల్లసిత మయినది. ఆ బ్రాహ్మణ సంప్రదాయమున హరిహరనాథు డారాధ్యుడు. తిక్కన కవితా రాధకులకును హరిహరనాథు డారాధ్యుడు. గురునాథ కవి కన్ని విధముల హరిహరనాథు డారాధ్య డయినాడు. ఈ మహిమ వెల్వడినది.

కవితకై గ్రంథము కలనము చేయుటేమి, విషయసంపత్తికై తెలియుం చుటేమి రచయితల యాచారము. ఆ గ్రంథములు కాలచక్రమున తిరుగుళ్ళు పడి కవితాస్వాదనమునకో విషయసంపదమధూతికో యయినవి. కవితరె గుర్తింపు వారలకు విషయగతి దూరమయినది. విషయ మవగాహము చేసికొను వారలకు కవిత కమనీయము కాక పోయినది. ఈ ప్రాతిస్వికవృత్తి మన తెలుగు గ్రంథముల తెలుగును సరిగ తెల కట్టినది కాదు. ఈ భాగవత మహిమ కవితలో విషయ మిచ్చి, విషయమున కవిత నిచ్చి యుభయమిశ్ర మగుట యొసంగును. అప్పుడు గురునాథ సంకల్పమును సంకల్పము కాగలదు. కొన్ని వస్తువిశేషములు స్వాభావికముగా కవితల కాత్మ నర్పిం చును. కొన్ని కవితలు వస్తువున కమ్ముడు పోవును. పౌరాణికములం దీ ద్వితీయము ముద్ర విడు కొన్నది. అది యసంగతమును కాదు. కైతల కైపులలో వస్తువు వక్ర మగుటను ఎట్టియెను కోర రానిది. ఈ మహిమ రూఢ మయిన వస్తువు అదుస్తరచన కూడి సుదర్శప్రత్యుత్త స్ఫూర్తము రత్న మగును. సంస్కృతము నందలి రచన యంతయు నేకవృత్తిక మయిన రచన. ఇందలి రచన భిన్నభిన్న స్వరూపము. గద్యపద్యాత్మకము, ఇది తెలుగుల పరిధి. ఏకవిషయమునకు ఏకచ్ఛందము సముచిత మని సాంస్కృతికులు తలచిరి. తెలుగువారు అట్లు తలచ లేదు. భిన్నచ్ఛందోగతులలో కూడ

అభిన్న విషయమూ(క్రమమును వా రనుసంధించిరి. గురునాథశర్మ గారి యను సంధానము ప్రవాహము అయిన పద్యములలో ప్రసన్నముగా సాగినది. ఈ కోమలశయ్య ఈదృశవస్తువుల కుపాదేయ మగుట సారస్వతేయుల కభినంద

ఇది కావ్యమా? పురాణమా? కావ్యము పురాణము కాదా? పురాణము కావ్యము కాదా? కావ్యఫలము లందు ధర్మప్రతిబోధనమును గలదు. ఇది మానవధర్మమును బోధించు కావ్యము. మానవుడు జన్మసాఫల్యమునకై భక్తిభావము కలవాడు కావలయును. దాని నిది సూచించును. భక్త్యుద్బోధము ముఖ్యముగా నిం దితరభావములు తగిన యంగభావము పొందినవి. "పాపబహుళ మయిన కలికాలమున భాగవతము మానవుల కుపకరించును" "అది భుక్తి ముక్తి దాయకము" ఈ యంశమును ముఖ్యీకరించు కొని యీ గ్రంథ మిట్లింత యయినది. ఇది మూలతత్త్వము. శుష్కముగ జెప్పిన వినరు. వినుట కనుకూలముగ జెప్పవలయును, దృష్టాంతముల నిరూపింప వలయును. కథల వ్రాయ వలయును సాక్ష్యము చూప వలయును. సంప్రదాయము ప్రదర్శింప వలెను. ఇవి యిట్టివి యుపాయములు, అనుపానములును అవి యిందున్నవి. కథతో కలసిన తత్త్వ మిందు ముఖ్యము. తేనెతో పొదిపిన మందిది. తేనె లేకున్న చిన్నవాడు మందు తినడు, మందు డగును. కథలున్న తత్త్వమును కాముకులును కబళింతురు, కథ ప్రతిపాద్య ప్రశంసాపరము. ఇట్లగుట అది యచారిత్రిక మని యప్రమాణ మని కాదు. ఆ యా కథల కాల చరితములును మహిమాంతమున నుండకే యున్నవి. ఈ భాగవత మాహాత్మ్యము పద్మపురాణములోనిది. స్కాందములో భాగవతమాహాత్మ్యము కలదు. కూర్మమునందు కలదు. ఇతరము లందును కలదు. చారిత్రికుల కాలదృష్టిలో నీ కథ లెట్టి వయిన నేమి? అన్నియు ప్రతిపాద్యమును ప్రతిపాదించును. శ్రీ గురునాథ రచన వివక్షిత ప్రతిపాదనమునకై ప్రసరించినది.

అసలు భాగవతార్థ మేమి? ఈ యంశమున కిచట అధికప్రసక్తి తగదు. అప్రసక్తియు క్షంతవ్యము కాదు. భూమవిద్య బోధింద గోరి నారదుడు సనత్కుమారుని సమక్షమున తన తెలివిడిలో నితిహాసములను పురాణములను చెప్పెను. ఈ పురాణేతిహాసము లా పురాణేతిహాసముల ధ్యాయులు కావని యేభారతీయు లందురు. భారతీయు లందరిలో వేరని కొందరు

వన్లై యందురు. కాని యంద గది వినరు. ఆ యనుట యకించిత్కరము మహాపురాణములు, ఉపపురాణములు, అతిపురాణములు, పురాణములు అష్టాదశాష్టాదశ సంఖ్యలో నున్నవి. ఈ భాగవత మే వర్గమున చేరిన దేమి? ఇట్టి వన్నియు నవంనవములు. భాగవత ప్రతిపాద్య తత్త్వము శ్రీ కృష్ణ పరబ్రహ్మ భగవానుడు. పురాణము పంచలక్షణ మగుట ప్రసిద్ధమె. అన్నియు విం దున్నవి. అయినను భాగవతమున ప్రతిపాద్యాశ్రయ తత్త్వము శ్రీ కృష్ణభగవానుడే. భాగవతార్థమును వ్యాఖ్యాత లనేక విధముల చెప్పిరి. అభిరుచి విశేషముల ప్రదర్శించిరి ఈ మహిమయు భాగవతార్థముచే చెప్పను. ఈ షడధ్యాయి భాగవతమునకు పీఠిక. భాగవతము వేదసార మని మంత్రరూప మని మహిమ నిరూపించును అందునచే భాగవత పారాయణవిధి ప్రతిపాదిత మయినది. మహారాష్ట్ర వ్యాప్త మయిన నాథభాగవతము భాగవతమును తన దారిలో పెట్టును, చైతన్య పథముచే భాగవత దీపము చూపు నని వంగ వైష్ణవు లనుట లే దేమి? పురాణతత్త్వమును పురాణము చెప్పున ట్లపురాణ ములు చెప్ప లేవు. పద్మపురాణ మిట్లు చెప్పినది. దాని నీ మహిమ చెప్పును అది హృదయధార్యము. అది భాగవత తీర్థావతారము.

శ్రీ మిన్నికంటి రచనలో ననుగత మయిన తత్త్వ మిట్లున్నది. వైధ భక్తి జ్ఞాన వైరాగ్య సహితము. దక్షిణ దేశమున నావిర్భవించినది. కర్ణాటాంధ్రములలో వైదికాచార క్రియాసంపత్తి కలిగి శోభించినది. పాక్షిక భావముల గూడి మహారాష్ట్రమున సన్నగిల్లినది. ఔత్తరాహుల అవైధ విధానమున విజాతీయ భావసన్నివేశమున చెదిరి పోయినది. విధిక్రియా కలాపము దూర ముంచిన, సాధనానుభూతులె ముఖ్యములుగ భావించిన బృందావన వీధులలో భక్తిరూపాంతరిత మయినది. పరాకాష్ఠ పొందినట్లు కన్పడినది. కాని జ్ఞాన వైరాగ్యములు ప్రక్షీణ కల్పము లయినవి. ఆ వీథి భక్తివిధానమున కుచితము కాదు. అందుచే ననర్థము కల్గును. అపు డొక శిష్ట పరిణామము వచ్చి తీరవలయును. అది సనకాదులు సూచించిన విధానము.

ఆధ్యాత్మిక జగమును సనకాదులు పాలింతురు. నేటికిని వా రట్లు విశ్వమును పాలించు చున్నారు. తత్ఫలన ఫలముగ సంప్రదాయ మవిచ్ఛిన్నమై ప్రకాశించుటను సాధకులు గుర్తింప గలరు.

భాగవతము భక్తి కలుగ జేయును. వైరాగ్య ముత్పాదించును.

జ్ఞాన మదయింపఁ జేయును. భాగవతము వేదసారము "వేద మీయ లేని ఫలంబును భాగవత మొసంగ వలతి సుమ్ము" అనుట భాగవత ప్రశంసాపరము. భాగవత శ్రవణ శ్రావణములు తదనుసంధాన విధానము సప్తాహ విధాన దీక్ష యత్యంత మావశ్యకము" ఈ యంశమె భాగవత మహిమలో ప్రాణము. ఈ ప్రాణము తెలియుట భాగవత ప్రాణులకు ప్రాణశక్తి కలుగును. నేఁ డుత్తర దేశానుకరణ భక్తిలో నాగ్రహీతమగు జ్ఞాన వైరాగ్యములు సన్నగిలుట చూచిన నా కీ యంశమును ప్రచారము చేయవలసి యున్నది.

ఈ ప్రబంధార్థమయిన కథాంశమున రెండు గమనము లున్నవి. భక్తి దేవి తన పుత్రులు ముసలి వారయినందున ఖిన్నయై నారదుని సహాయ మడిగినది. సనకాదుల నుండి నారదు డుపాయ మెఱిగి భాగవతయాగ మారంభింప జేసెను. భక్తి పుత్రులు సంతుష్టులయిరి." ఇది యొకటి.

ఆత్మదేవుడు ముని సంప్రార్థన మొనర్చి పుత్రప్రద మయిన పండు సంపాదించి భార్య ధుంధులిని భక్షింపు మనెను. ఆమె [illegible] చేయ లేదు. చేసితి ననెను. [illegible] గర్భవతి యయ్యెను. భర్తను వంచించినది పండు గోవునకు వేసినది. గోవునకు గోకర్ణుడు పుట్టెను. ధుంధులి తన చెల్లెలి పుత్రుని తన పుత్రుని జేసికొనినది. వాడు దుష్టు డయ్యెను. ఆత్మదేవునకు రోత పుట్టినది. భాగవత మనుసంధించి ధన్యు డయ్యెను. ధుంధులీ పుత్రు [illegible] వేశ్యలు పట్టి చంపిరి. వాడు ప్రేత మయ్యెను. గోకర్ణుడు శ్రాద్ధములు పెట్టెను. ధుంధులీపుత్రుడు ధుంధుకారుని ప్రేతత్వము పోలేదు. భాగవతపారాయణము చేయగా ప్రేతత్వము పోయి దివ్యత్వము కల్గినది. ఇది రెండవ గమనము.

ఈ రెండిటి కొక అతుకు మూహింప వచ్చును. అది తుదకు విశదము నయినది. మొదటి గమనమున తత్త్వమె యున్నది. కథకు సమన్వయము లేదు. రెండవది మానవకథ. తత్త్వసమన్వయము గల కథ. ఆత్మకథ యాసక్తి ప్రదము. అదియె ప్రశంస నభిలషించు వారలకు గావలయును. కావలసినది మహిమలో నున్నది.

రెండవగమనములో కూడ నొక తత్త్వ గ్రంథి యున్నది. అది యత్ర శాస్త్రము కాదు. ఆత్మదేవుడు జీవుడు. జీవునకు ధాతిక దేహము కన్న విద్యా

మును తపోమయ యజ్ఞమయ దేహమె ముఖ్యము. అది భాగవతామృత మున లభించును. ధుంధులీ పుత్రుడు ధుంధుకారి జీవుని దుష్టచిత్తము. అది అన్యప్రాప్తము. దుష్టచిత్తము పంచేంద్రియ వశమై హత మగును. గోకర్ణుడు జీవుని నిశ్చయాత్మక మయిన బుద్ధి. అదియె జ్ఞానవైరాగ్యముల గూడి భాగవ తభక్తి కలిగి యనుసంధాన మొనర్చును. ఆ విధి సర్వప్రదము.

ముఖ్య మగునది మరి యొకటి కలదు. అది లేకున్న నేదియు లేదు. మహిమలో నదియె ముఖ్యము. అసలు భాగవతము నారద ప్రేరణ మునను యవతరించినది. తద్విషయమై నారదు డందుకొన వలసినది యిం దున్నది. అదియె సప్తాహదీక్ష. సనకాదులు దానినె యుపదేశించిరి. నారదుడు చేయించిన దది. గోకర్ణు డొనరించినదియు నదియు.

సప్తాహ దీక్షా యాగశాలలో ధుంధుకారునకు స్థలము లేక పోయిన దట. వెదురులో వాయువై దూరెనట. ఆ వెదురులో నేడు గ్రంథులు దిన మున కొకటిగా భిన్నము లయినవి. గ్రంథిభేదనము కాగా వాడు ధన్య వర్యుడు. మానవుని వెన్నెముక వెదురు. అందును ఏడు స్థానము లున్నవి. మూలాధారాది షట్చక్రములు దాటి సప్తమావరణము దాటిన బ్రహ్మామృ తము లభించును. ఈ యోగప్రణాళిక యిం దున్నది. అది సప్తాహదీక్షా రహస్యము. ఇది సనకాది విద్య. అందువలె భాగవత సప్తాహము ప్రమితము.

యోగవిద్యాసక్తు డయిన మిన్నికంటి గురునాథశర్మ సమాసక్తితో భాగవతమాహాత్మ్యమును అనువదించెను. కొన్ని యంశముల నచటచట స్వసంతృప్తికై విస్తరించెను.

ఇమా తు శయితా వత్ర సుతౌ మే క్లిశ్యత క్రమాత్
ఇదం స్థానం పరిత్యజ్య విదేశం గమ్యతే మయా.

దీనికి స్వేచ్ఛానువాద మొనర్చను 1–76.

ఇట్టివి కొన్ని యున్నవి. మిన్నికంటికవి కోమలహృదయుడు. ఆత్మ దేవ కథా కథనమున నిది స్పష్ట మగును. ధుంధులి భావములను ఇంక నట్టి విశేషములను లోకము చూచి చెప్పినట్లు చెక్కినట్లు గోచరించును. ౧౦౦పుటలో రాజమహేంద్రవరము విజయవాడ వెల్లూరు లున్నవి. కవి కవిపరిచితములు. అనాటి కాకపో వచ్చును. అయిన నేమి? ఈ నాటి

వాడుక కట్టివి కవికి వచ్చినవి. కవివాడుకలు కవితలో నేల రావు? తెలుగు నాటి తీపిపలుకుబళ్ళు మహిమలో నెన్నియో యున్నవి. నిత్యజాపకు డయిన గురునాథశర్మ కవితా భావుకతా సంపత్తి ఫల మయిన యీ భాగవత మహిమ భాగవత జనత కవశ్య ముపాదేయము. వివక్షితమును విడువక అన పేక్షిత మగుదాని యందు కొనక రచన చేయుట కవి కభీష్టము కవి యయిన శ్రీ మిన్నికంటి గురునాథశర్మ తన కవిత కీ విధానము ధన్యత నాపాదించు నని సంభావించెను, ఇట్టి చిత్రపాక మందర కుండను. గురునాథశర్మ గారికి వయఃపరిణతి రానున్నది. కవిత కీ నాటికి కలిగిన యీ పరిణతి యా పరిణతి, పరస్పరవిభూతి సుందరములై యుండుట నాశింతును.

ఇక నిది నిగమనము. సనకాదులాధ్యాత్మిక సమన్వయ సంధాతలు. సాధన వ్యత్యయము లోకమున గలిగినప్పుడు వారి సంప్రదాయము ప్రతిష్ఠింతురు. తదనుసరణము మనకు శరణ్యము. భాగవత మాహాత్మ్య ప్రతిపాదకము అయిన యిందలి కథలలో స్వార్థతాత్పర్యము లేదు. భక్తి జ్ఞాన వైరాగ్యములకు వ్యక్తి రూప మాపాదించిన కల్పనము స్పష్టము. ఆత్మదేవుడు ధుంధుకారుడు గోకర్ణుడు అను వ్యక్తుల విషయమై జీవగతి సంబంధమును స్పష్టము. ఈ కథలందిట్లు సమన్వయము చూచుకొని గ్రంథిభేదనము సంపాదించుకొనుట భాగవతయోగము. ఈ యోగమె ముఖ్యముగా అసలు భాగవతమును గూడ భావించుట సాధకపథము. సాధకపథ సంచారులు గురునాథశర్మగారు భాగవత మహిమ ద్వారముగా కావ్యయోగమును సూచించిరి. భాగవతవిభూతి కావ్యవిభూతియై యవతరించుట సాధకుల కానందానుభూతి.

"భుక్తి ముక్తి ప్రదాం భక్తిం
జ్ఞాన వైరాగ్య సంహితాం
కావ్యయోగ సమాలీఢాం
లోకా భజత! భావితాః"

భాగవత గోష్ఠి — జమ్ములమడక మాధవరామశర్మ.
మార్గ కృష్ణ నవమి — గుంటూరు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## ప్రథమాధ్యాయము.

శ్రీమహితు సచ్చిదానం
దామల రూపుని బ్రకృతి స।యామకు సృష్టి
క్షేమ లయ కారణుని స
ర్వామర పూజితుని దలఁతు । హరి హర నాథున్.

జనని యశోదఁ జేర్చి చీ పో!
యని సవ్వింతంగ బోసి।యగు నోట జగం
బును జూపి సంభ్రమము గూ
ర్చిన శ్రీకృష్ణపరమాత్మ । హృదిని స్మరింతున్. 2

సకల విభూతు లందఱు కొ।సంగును దాను గజాజినంబు గ
ట్టికొనును, బాఁవ పేరుల ఘ।టించును జాబిలివంక పూవుఁ జె
న్నిక ధరియించు బూది మెయి।నిండ నలందు వృషంబుపైఁ బ్రపం
చకమునఁ దారు సట్టి ఘన।శాంకర తత్త్వము నాశ్రయించెదన్.

తలి ని న్నాఁకట నిల్పి పోవునెడ నే।త ద్వామ హస్తంబునం
గలయా! కార్తికమా! పలింగెఁ బ్రమథుల్।కారాకులై రతురా
వళులా! యయ్యవిబాణపుందుటములా!। బాలయ్యా! నీ వన్నిటం
గలవే! కాన గణాధిపుండ వయితో। కైకొమ్ము నా మ్రొక్కులన్.

పింగ జటా రంగున్ గృ
ష్ణాంగున్ గృష్ణాజినో త ♦ రా సంగున్ ప
త్సంగు నట ప్రచ్ఛురిరసనో
త్సంగు దయాపాంగు వ్యాస ♦ సంయమిఁ దలఁతున్. 5

అమలినభక్తిఁ గొల్తు నిగ♦మాంతములన్ గ్రహియించి యెల్ల క
ర్మములఁ ద్యజించి ప్రవ్రజిత♦మార్గము వట్టి యొకండపోవ మో
హమునను రార! ముద్దుకొడుఁ♦కా! యని వ్యాసుఁడు పిల్వ దన్మయ
త్వమునఁ బ్రతిధ్వనించెఁ దరు♦వర్గము తత్సకలాత్ము శ్రీశుకున్. 6

మనసిచ్చెనా? యొట్టి ♦ మందమతికైన
నటచేరిలో మోహ ♦ మగపఱచుచు
గర్జించెనా? యొట్టి ♦ గడుసరి బుధుఁడైన
దాసోహమని పల్కి ♦ తప్పుకొనును
బోధించెనా? యొట్టి ♦ భూరి శాస్త్రంబైన
వనఁటిపండొల్చి పె♦ట్టిన విధంబె
ఆసీనుఁ డయ్యెనా! ♦ యానందమున నిర్వి
కల్ప సమాధిలోఁ ♦ గ్రాలుచుండు
పంతత జ్ఞాన వైరాగ్య ♦ సంయుతుండ
నఘుఁడు కల్యాణ పూర్వ శా♦నంద భార
తీ యతీంద్రుఁ డస్మద్గురు♦దేవుఁ డేను
వారి పాదపద్మంబులన్ ♦ భక్తిఁదలఁతు,

కాశికా లింగమ్మఁ ♦ గైఁబూని కాల్నడఁ
దోడ్తెచ్చె శివరామ ♦ ధూర్వహుండు
తన తండ్రి సప్త సం♦తానంబులను జేసి
పోసిక పోషించె ♦ బుచ్చిరాజు
'ఏరుచూ' గ్రామాధి♦కారి యుదారుండు
ధీరుండు నా మీఁతె ♦ పేరరాజు
వ్రాయంగఁ జదువంగ ♦ వాదముల్ దీర్పంగఁ
బ్రౌఢుఁ డయ్యెను శివ♦రామ బుధుఁడు
వీరి ప్రపితామహుఁడు, తాత, ♦ కూఁకిమి పిత
యన్న యొనలేని కీర్తిఁ ♦ గన్నవారొ?
అట్టి లక్ష్మార్యునకు మదీ♦య జనకునకు
నా జనని సుబ్బమకు వంద♦నము లొనర్తు. 8

వికృతి సంవత్సర మార్గశిర కృష్ణ దశమీ సౌమ్యవాసరంబున (3-1-1951) నా నిత్య కృత్యంబగు సహస్ర గాయత్రిం గావించుకొని శ్రీమద్భాగవత మహిమ వ్రాయ నిష్టదేవతా గురు నమస్కారము లొనర్చుచున్నాఁడ. దీనికిఁ దొలినాఁ డొక విచిత్రము జరిగినది. దాని నెల్లవారు నమ్ముకున్నను సత్యము చెప్పెదను. పరులు నవ్విన నాకేమి? వికృతి మార్గశిర కృష్ణ నవమీతిథి వేకువఁ గలలో నొక్క విశాల నేత్రుని దివ్య తేజో ముఖమండల సందర్శన మహాభాగ్య మురరిద్వారమున లభించినది. అమ్ముఖారవిందము హరిదియో హరునిదియో గుర్తింపనైతిని. అమ్మధురస్మిత రోచులు దవ్వుల నున్న నాపైఁ బ్రసరించుచుండెను. వేనకువేల జను లడ్డముంటచే దాపున కేగలే

నైతిని. అవ్వల నవ్వుచు నమ్ముఖబింబము లోనికరిగె. నాకు మెలఁకువ కలిగె. ఆనాటి సాయం సమయమున దనయింటి ముంగలగా నల్లంత చన్న నన్నుఁ బెద్ద యెలుంగునఁ జీరి మన్మిత్రుండు పరమ బ్రహ్మణ్యుండు రోగ వాసిష్ఠాంధ్రీకర్త శ్రీ మద్దూరి సాంబయ్యగారు 9

అందఱకు సులభముగఁ దెలి
యం దేట తెనుంగులోన ♦ ననువాద మొన
ర్పం దగుఁ జుమ్మీ యని యి
చ్చెం దద్భాగవత మహిమ ♦ చెలువారు కృతిన్. 10

ఏను దమ కిప్పుడే వా
గ్దానము చేయంగ లేను ♦ దానిఁ జదివి యా
పై నెఱిఁగింతును భగవ ద
ధీనుఁడ నే నెవఁడ నెయ్యది యొనర్చుటకున్. 11

అని పలికి వచ్చి యాలో
చన మొనరించితిని నంత ♦ స్వప్నంబునఁ దోఁ
చిన కోటిసూర్య తేజో
ఘనము స్మృతికి వచ్చి ధైర్య ♦ కలితుఁడ నైతిన్. 12

ఆ రేయియే యా సంస్కృత కృతిం జదివి యనువదింప సంకల్పించి నిదురించి మఱునాఁ డిష్టోత్రాదికము వ్రాయుచున్నాఁడను. 13

ఉత్తమ మగు పద్మ పురా
ణోత్తర ఖండమున వ్యాస ♦ సూక్తి మహిమ సం

పత్తి కలదు తెలుఁగున నది
హత్తింపఁగ మొదలయిడితె? ♦ హరి హర నాథా. 14
భాగవత మహిమ నుడువఁగ
వాగీశుండో? శుకుండొ? ♦ వ్యాసుండో? ది
వ్యాగమమొ? కాక పెర యెవఁ
డాఁగఁగలఁడు బొమ్మ సటిది ♦ హరి హర నాథా. 15
ఉన్నది యున్న ట్లెఱిఁగిం
తున్నఁ గ్రొత్త తలఁపులను ♦ దొర్లింపఁ దదీ
యౌన్నత్యంబున కంతా
పన్న మతులు గాకుఁడయ్య ♦ సజ్జనులారా! 16
కతలో, వర్ణనలో, నా
స్వతంత్రతను జూపెదను రసం బుట్టిపడన్
మతిమంతులు దలలూఁపని
కృతి యేటికి? బీరువాలఁ ♦ గృములు దినుటకే! 17
* భాగవతము వ్రాసి పిదప
మూఁగగ నున్న, నను మరలఁ ♦ బురికొల్పితివే
భాగవత మహిమ వ్రాయ ద
యా గరిమ, నిదెంత పేర్మి! ♦ హరి హర నాథా 18
నీ లీల లద్భుతంబులు
బాలుని మాటలను వినఁగఁ ♦ బాల్పడితివి నా
కేల మది సంశయ మ్మిఁక
నాలింపఁగదయ్య వినుతు ♦ హరి హర నాథా. 19

* ఇక్కటికి ఏకాదశ ద్వాదశ స్కంధముల నాంధ్రీకరించితి.

# కథాప్రారంభము.

కల మునులు సత్రయాగము
సలుపుచునున్నయెడ నైమిశమ్మున శ్రీ వ్యా
సుల శిష్యుండు మహామతి
కలఁడు బహుపురాణవిదుఁ డొకఁడు సూతుఁడనన్. 20

ఆ సూతున కభివాదము
సేసి కథామృత రసం బశేషము ద్రావం
దోసిలి పట్టుటలో వ
గ్రేసరుఁడగు శౌనకర్షి కేల్మోడ్చి యనెన్. 21

సూతా! శమాది షట్క స
మేతా! యజ్ఞాన బహు తిమిర విధ్వంస
ఖ్యాత ధిషణార్క కిరణ
వ్రాతా! తాతా! యొకండు ప్రార్థన వినుమా! 22

చెవులకుఁ బండువ యగుగతి
వివిధ కథాసారములను వినిపింపుము భా
గవతుల కెటు భక్తి జ్ఞా
న విరాగ వివేక వర్ధనంబగు నొక్కా. 23

వైష్ణవులు మహామోహా మేవగిదిఁ ద్రోసి
వైతు? ఈ పాడు కలి నెల్ల వారు నసుర
భావులై క్లేశముల మ్రగ్గువారై, వార
లెట్లు బాగుపడుదు రానతిమ్ము దేవ! 24

పావనములలోనఁ ♦ బావన మైనది
శ్రేయములను మిపుల ♦ శ్రేయమైన
దనఘ! కృష్ణుఁ జేర్పునట్టిది యొక శ్రేష్ఠ
మైన సాధనమ్ము ♦ నానతిమ్ము. 25

లోకసుఖము చింతామణి, ♦ నాక సంప
దలను గల్పవృక్షమ్ము లో♦కుల కొసంగు
తుష్టుఁడౌ గురుండో యోగి ♦ దుర్లభంబు
పావనంబు వైకుంఠంబు ♦ బడయఁ జేయు. 26

అనిన సూతుం డిట్లనియె. 27

శౌనకమునీంద్ర! నీప్రియం♦బైన ప్రశ్న
మునకు లెస్సగా యోజించి ♦ వినుతునయ్య.
సర్వ సిద్ధాంత సార మ్మ♦సార పార
దూర ఘోర సంసార ని♦స్తారకమ్ము. 28

ఏది భక్తి వృద్ధి ♦ నొనఁగించు? నేది శ్రీ
కృష్ణ దేవునకును ♦ బ్రియకరమ్ము?
దాని నీకుఁ జెప్పె ♦ దను వినుమా! సావ
ధాన చిత్తమునను ♦ శౌనకర్షి! 29

శ్రీ మద్భాగవతమ్మున్
స్వామి శుకమహర్షి కలినిఁ ♦ జాటినదానిన్
ధీమాన్య కాలసర్పో
ద్దామ త్రాసాతిశయముఁ ♦ దఱిమెడి దానిన్. 30

విను దానికన్న మఱొకటి
పొనరవడ దించుకయు మదిని ♦ ధ్యానము సేయన్
జననాంతర పుణ్యం బుం
డిన నే భాగవత మాత♦నికి లభియించున్.

(శ్రీ) శుకమౌని పరీక్షి న్నరేంద్రున
కతిముదంబున భాగ♦వతము సెప్ప
సభలోన నుండిన ♦ సమయంబు నందు సు
ధాకుంభ హస్తులై ♦ నాకవాసు
లరుదెంచి శుకమౌని ♦ కభివాదనము సేసి
పలికి రిట్లు స్వకార్య ♦ పరతఁ జేసి
మునివర్య ! యిదె సుధా♦పూర్ణ కుంభము తెచ్చి
తిమి కథాసుధ నిచ్చి ♦ దీనిఁ గొనుఁడు
ఏము శ్రీభాగవత కథా♦మృతము గ్రోలి
తనిసెదము మీరు కృపన క♦ర్దాని నొసఁగ
నాత డయ్యమృతము గ్రావి ♦ యమరణుఁ డగు
వినిమయంబున కిది ఫలం♦బనఁగ నపుడు. 32

ఫక్కున నగి యిట్లని నా
టక్కరి వేల్పుగమిలో జ♦టాధారి భళీ!
యెక్కడి కథ! యెక్కడి సుధ!
యెక్కటి! మణి కాచ మొక్కఁ♦డగునా? యొదుగా. 33

అని వా రర్థకులై యుం
డ నెఱిఁగి కథామృతం బి♦డక శంకించెన్

ఘన భాగవతీ కథల
య్యానిమిషులకుఁ గూడ దొరక♦వయ్యా మునీంద్రా! 34

జనపతి మోక్షముం గనుట ♦ సారసగర్భుఁడు చూచి విస్మయం
బునఁ దన సత్యలోకమునఁ♦బూనిచి త్రాసునఁ దూఁచె సా
ధనముల నెల్ల, నేవియును ♦ దాని గురుత్వము నందలేక పో
వ నపుడు చూచుచున్న ఋషు♦లెల్లరు నచ్చెరువంది రాత్మలన్

జనులు కనుఁగొనిరి భగవం
తుని భాగవతమ్ము భక్తి♦తోడఁ జదివియు
న్వినియును వైకుంఠమునకుఁ
జనియును గలి దీసి కేది♦సాటి మునీంద్రా 36

మును నారద ముని పతికి
న్సనకాది మునీశ్వరులు ఘృ♦ణావరు లగుచున్
వినిచిరి సప్తాహంబునఁ
బ్రణతశ్రేయః ప్రదంబు ♦ భాగవతంబున్. 37

బ్రహ్మ సంబంధ సంపత్తిం జేసి నారదుండు భాగవతంబు నెఱింగి యున్నను సప్తాహ శ్రవణ విధిమాత్రము సనకాదులు నారదున కెఱింగించి రనిన శౌనకమహాముని యిట్లనియె, 38

## * సనకాదికుమార నారద సమావేశము. *

జుట్ల జుట్లకు ముడివెట్టి ♦ చోద్యముగను
జూచుచుండు, నొక్కెడఁ గాలు ♦ సాఁచి నిలువఁ
దట్టి నారదుండు విధిగ ♦ నెట్టు వినెను?
సనక మునులతో యోగ మే ♦ చాయఁ గలిగె? 39

అనిన మాతోఁ డిట్టు♦లనియెఁ జెప్పెద విను
భక్తియుక్తమైన ♦ భవ్య కథను
దాని నాకు శుకమ♦హానుభావుఁడు రహ
స్యముగఁ జెప్పె నీకు ♦ నది వచింతు. 40

కలదు విశాలాపురము
జ్జ్వల నగరీవరము బహు వి♦శాల నివద్యా
వళి సుందరము నభస్సృ
శ్శిలయ మనోహరము బహుళ ♦ నృచయాకరము 41

అచ్చట వెలసిన ♦ యఖిలేశ్వరుం డొసం
గని వాంఛితంబులు ♦ గానరావు
అచ్చటి తీర్థమం ♦ దవగాహన మొనర్పఁ
గాఁ బోవకున్న రో♦గములు లేవు
అచ్చటి క్షేత్రమం ♦ దంఘ్రి మోపిన వచ్చి
వాలని పుణ్యపుం♦జాలు లేవు
అచ్చటి గాలి మై♦నంటినఁ గలుగని
ప్రవిమలజ్ఞాన సం♦పదలు లేవు

భక్తిముక్తుల కయ్యది ♦ పూల బుట్ట
సాధుకోటుల కయ్యది ♦ సాము గరిడి
సర్వవిద్యల కయ్యది ♦ సంతవాడ
కాపురము లక్ష్మి కది విశా♦లా పురమ్ము 42

అం దొకవాఁడు నలువురు సు
ధీంద్రులు సద్గోష్ఠిక వి♦హృతి సల్పుచునుం

డం దపసి రతనము శీతా
నంద సుతుఁడు నారదుఁడు క♦నంబడె నొకచో 43

నారదుఁడు వందనము సేయ ♦ నలువురు ప్రతి
వందన మొనర్చి నారదు ♦ వాలకము నె
గాదిగం జూచి సనకాదు ♦ లాదరమునఁ
బలికి రిట్లు గంభీర ని♦స్వనము దోఁప 44

ఏమి మునీశ్వరా! కుశల♦మేకద? యెక్కడనుండి రాక? నీ
మోమది యేల విన్నఁదన♦ముం గనె? నెక్కడ కేగుచుంటివో?
తామసముం బొనర్పక గ♦త ప్రదినంబులఁ జింతిలం గతం
బేమి? విముక్త సంగులకు ♦ నీ తెఱఁ గొప్పదు గాదె నారదా!

నారదుఁడు సనకాదులకుఁ దాను గన్న తీర్థములం జెప్పుట.

నావుడు నారదుండు ఋషి♦నాథుల కిట్లను నుత్తమోత్తమం
బీ వసుధాతలం బని గ్ర♦హించి యిటం జరియించుచుంటి గో
దావరిఁ బుష్కరంబునను ♦ దానము సేసి ప్రయాగ మాధవున్
సేవలఁ దన్పి కాశిని వ♦సించితిఁ గొల్చుచు విశ్వనాథునిన్. 46

ధాత్రికి భూషణం బయిన ♦ ద్వారకకుం జని మేను విద్విష
ద్ధాత్రు రమా కళత్రు హరిఁ♦గాంచి సపర్య లొనర్చితిన్ గురు
క్షేత్రము మెట్టితిం బిదప ♦ సేతువు డాసితి రామలింగని
న్నేత్రము నిండఁ జూచితి ము♦ని ప్రవరుల్ జని ధన్యమయ్యెఁబో

పొంగారెడి మనము వెలుం
గం గంటిన్ రంగనాయ♦క శుభాంగము శ్రీ
రంగము కైవల్య రమా
శృంగము వైష్ణవ మహా♦ప్రజా సంగమ్మున్. 48

మఱియుం గల తీర్థములం
దరిసించుచుఁ దిరుగుచు వసుధాతలము మునీ
శ్వరులారా! యరసితి నెం
దరసిన శర్మమ్ము దోఁప దాత్మ సుఖంబుల్. 49

* నారదుఁడు సనకాదులకుఁ గలి విశేషములు చెప్పుట *

చాగురే! యధర్మ సఖుఁడైన కలిచేతఁ
బుడమి మిగుల బాధ బడుచు నుండె
సత్యమును దపంబు శౌచంబు దయయును
దాన మచటఁ గూడఁ గానఁ బడద. 50

అద్దిర! యేడఁ గన్న జను లందఱుఁ బొట్టల నింపువారె బల్
బద్ధులు పల్కువారె పెరలం జెడఁగొట్టఁ దలంచువారె పె
రద్దికి నొగ్గువారె శ్రుతి రాజముఁ దిట్టెడు వారె పుణ్యపుం
బుద్ధులు లేనివారె కడు మొద్దులె మోఱకులే గరాసులే. 51

అగ్ని యెదుట 'నాతిచరామి' యని ప్రమాణ
మాచరించి పెండ్లాడిన యట్టి వారె
నొండొరుల నెడఁబాసెద రొండె, మోస
గించి చరియింతు రొండె ద్వేషించు నొడువ. 52

అకటా! కడుపునఁ బుట్టిన
కరితల నమ్ముకొని ధనముఁ గైకొనఁగా నాఁ
గరి యీ కలియుగ మందును
నరులా? రాక్షసుల? వీరు న్యాయము సెపుఁడా! 53

ఆలె గృహంపుఁ బెద్ద కల దన్నను లేదసిరా, స్వమాతయుం
జాలదు తండ్రి మాట కొనసాఁగదు సర్వము నిరయించి యీ

పోలిక సంచరింపు మని ♦ బుద్ధులు సెప్పుచు నుండువాఁడు త
త్త్వాలకుఁ డేగృహస్థుఁ డిపు♦డా యెను జూపుల గొడ్డుఁగీమునర్
నదులును దీర్ఘము లాశ్రమ
పదములు యవనావృతములు ♦ పాషండాద్య
న్మదితులు దేవాలయములఁ
గడిసి కాలిచి రకట! పెక్కు♦గతుల నిజేచ్ఛఁ, 55

లేఁడు సత్క్రియుండు♦లేఁడు సిద్ధ వరుండు
లేఁడు జ్ఞాని యొకఁడు♦లేఁడు యోగి
కలి యసియెడు పెద్ద ♦ కార్చిచ్చు చేతను
సాధనంబు భస్మ ♦ సాత్కృతంబు. 56

జనపదము లన్న విక్రయ♦శాల లయ్యె
బ్రాహ్మణులు వేద విక్రయ♦ప్రవణు లైరి
అంగనలు స్వకీయాంగమ్ము ♦ నమ్మ కొనెద
రిట్టి కలిదోషములఁ గను♦చిలఁ దిరుగుచు 57

* నారదుఁడు యువతీ వృద్ధులం జూచుట *

ఎవఁడు సేసెనొ? కుంత ♦ లీంద్రు ఫణామండ
లిం దాకఁ దాండవ ♦ హిండనంబు
ఎవఁడు నీరాడు గో♦ప వధూ దుకూలముల్
గైకొని లేమ్రాఁకు♦పైకి బ్రాఁకె
ఎవ్వఁ డవ్వరును బ్రో♦లేగిన నంద గో
పుం దెచ్చె డెంద మా♦నంద మొంద
ఎవఁడు సూపెను సిజా♦కృతి సుందరతను గా
[illegible]

బ్రహ్మ గాంధర్వ గీత మొ ♦ వ్వాఁడు వాసి
వాసిఁ గైసేసి ప్రేమాలు ♦ గాసివతిచె
నట్టి శ్రీకృష్ణు లీలల ♦ కావటమ్మ
యామున తటమ్ము ముక్తిక ♦ వ్యా నటమ్ము. 58

ఆరయఁ జేరఁ బోతి నట ♦ నావల నావుల కోకదానిఁ గో
కారిని జిరికిం గొనని ♦ యాస్యము దానిఁ బ్రశస్య దాని క్రొ
వ్వాఱిడి వృచ్చ ముద్దు నక ♦ యుంగులదాని ననంగు భృంగుల
న్గేరెడు కొప్పుదానిఁ దరు ♦ ణి న్ననఁబోణి నొకర్తుఁ గాంచితిన్.

వేసవి తటి యేళ్ళ ♦ తో పరిగా సిరల్
బయటఁ బడియె నెత్రు ♦ వట్టి పోవ
బొటియుల నిఱుకు తా ♦ మర లట్లు బొమ్మ గుం
టలలోనఁ గన్నుల ♦ డాగి యుండె
కేమ లేని వయిరు ♦ తీరునఁ బలుచనై
వెంద్రుక లన్నియు ♦ వెలరు వాఱె
వడమటఁ బొడము నా ♦ గవవల వడువున
నొడలిపై నల్లెడ ♦ ముడుత లడరె
పట్టు తప్పి యంగంబులు ♦ వడఁకఁ దొడఁగె
ఎడుద యూర్పు గాడ్పులు మాత్ర ♦ మదరు చుండె
నట్టి యిరువురు వృద్ధు ల ♦ య్యెడ ధరిత్రిఁ
గదలి మెదలక పడియుండ ♦ గంటఁ బడిరి. 60

* యువతి వృద్ధులం గూర్చి విలపించుట *

యువతి వృద్ధుల ప్రక్కఁ గూ ♦ ర్చుండి కన్న
దవమై బొట బొట న్రశ్రు ♦ వారి బిందు

లురలి చెక్కిళ్ళపైఁ బడు♦చుండ రోద
నంబు సేయుచు నిట్టు ల♦నం దొడంగె. 61

బిడ్డలార! యెంత♦పెద్ద కాలము వచ్చె
నాదరించు వారు ♦ నాదరువును
జూపువారు లేక ♦ స్రుక్కవలసి వచ్చె
నూఱడిలుఁడు ధైర్య♦మూని నిలుఁడు. 62

ఉన్నది లేనిది యెఱుఁగరు
చన్నది తిన్నదియు నెఱుఁగఁ♦జాలరు పరు లే
మన్నది చేసిన దెఱుఁగరు
గ్రన్నన నీపాటు లేల♦గలిగెను మీకుఁ? 63

దూషించిన భూషించిన
రోషింపరు తోష మొంద♦రు శరీరమ్ముఁ
శోషింపఁజేయ రెలమిం
బోషింపరు మీకుఁగూడ ♦ ముప్పు గలిగెనే? 64

తెలిసికొనరు వలువ మెయిం
గలదో! లేదో! పడినది ♦ గ్రామమొ? వనమో?
నిలిచితిరో? కూర్చుంటిరో?
పిలిచినఁ బలుక రదియేమి! ♦ ప్రియసుతులారా! 65

అయ్యో! వీరిని గాపాడుఁ ♦ డన్నలార!
ఆఁకలియొ దప్పిదమో చూడుఁ ♦ డయ్యలార!
చెవులు మూయరె నాడి ప♦ట్టింపరె మ
హానుభావు లిదెవ నవ్వా♦రైన లేరె! 66

అని పలవించుచుం దెసల ♦ నారయుచుం గని ముదుసళ్ళ కంతలో
నన యుచితోపచారము లొ♦నర్చుచుఁ దత్తఱ మొందుచున్న న
వ్వనితను జట్టుముట్టి మగు♦వల్ మఱికొందఱు బుజ్జగించు చో
య్యావ సురటీలంతో విసరు♦చున్నరో! వందురఁబోకు మాచనఁ
పను దవ్వులనుండి య♦దెల్లఁ గాంచి
యేమి యీదుఃఖ? మీమూఁక ♦ యేమి? తెలిసి
కొనియెదం గాక యని చెం♦తకుం జనంగ
నన్నుఁ గని లేచి యువతి వం♦దన మొనర్చి. 68
రందు దయచేయుఁడు తమ ద♦ర్శనము కతన
నా యెడందలోని వసట ♦ నాశ మయ్యె
సాధు దర్శనంబునఁ గలు♦షములు దొలఁగు
నెంత భాగ్యమో మిముఁ గంటి ♦ నిట్టియెడల. 69
తమవంటి సాధువు,లను
త్తమ దర్శన మొసఁగి లోక ♦ తతి పాపములన్
దమియింతు, రింక నొక వా
క్యముఁ బలికిన ఫలముఁ జెప్ప♦నలవియె నాకున్. 70

* నారదునకు యువతి తమ వృత్తాంతము చెప్పుట *

నారుఁడు నే నిట్లడిగితి
నీ వెవరమ్మ? పడియున్న ♦ వృద్ధులెవరు? లీ
లావతులు వీరలెవ్వరు?
నీ వేడ్చెద వేలనమ్మ ♦ సకలముచెప్పుమా! 71
అనఁగ యువతి పలికె ♦ నయ్యా! నే భక్తిని

# ప్రథమాధ్యాయము.

సూను లీ యిరువురు ♦ జ్ఞాన వైరాగ్య వి
ఖ్యాత నామములను ♦ గన్నవారు.

గంగాదులు నా శ్రమ మడఁ
గంగఁ గొలుచుటకు స్త్రీల ♦ గతి వచ్చిరి వే
గం, గాని సురల కొలు నెపఁ
గంగఁ గూడ సుఖ మొదఁదఁ ♦ గలుగదు నాకుఁ.

ఆలసింప నాగు మికింత ♦ యాలకింపు
మామకీన వృత్తము చంద♦మూమ ఘుటిక
చాలఁ గలదయ్యె నైన వా♦చాలఁ గాను
దాన సంక్షేపముగఁ జెప్పె♦దాన వినుము.

ద్రవిడ దేశమ్మున ♦ నవతార మెత్తితిఁ
బెరిగితిఁ గర్ణాట ♦ పృథివి మీఁద
నంత మహారాష్ట్ర ♦ మం దించుకొంచుఁక
పన్న గిల్లితిని ఘూ♦ర్జరమునందుఁ
జాగుఁ జే! దుష్ట పా♦షండులు దుండగుల్
ఖండించి రీయంగ ♦ కములఁ బట్టి
యేమి చెప్పుదుఁ దండ్రి! ♦ యిట్టి యాపున నేను
గొడుకులతో నెంతో ♦ గోడు గుడిచి

ఆవలం దాసితిని వైష్ణ ♦ వావనమ్ముఁ
బావనమ్ము శ్రీకృష్ణ బృం♦దావనమ్ము
వచట రమ్యనైతి నవీన ♦ నైతి యువతి
నైతి సుందరినైతి ది♦వ్యాంగ నైతి.

నా సుతులు జ్ఞాన వైరాగ్య ♦ నామకులు ప్రశ
మమ్ము నొంది యచ్చట విశ్ర♦మమ్ము గొనిరి
తనయుల నీడి నే విదే♦శముల కరిగి
తిరిగి వచ్చితి నయ్య బ్ర♦హ్మ ఋషివర్య ! 76

ముదిమి చేత ముడుల ♦ పడ వడ బడుచున్న
కొడుకుఁ గుఱ్ఱలఁ గని ♦ కుందు చుంటిఁ
దల్లి నైన నేను ♦ తరుణి నౌట యదేల ?
యకట ! సుతులు వృద్ధు♦లగుట యేల ? 77

ముప్పుర మొందు నొక్కటనె♦పల్కుచు నుందుము వీడియుండలే
మవ్వము గాన నే ముసలి♦నౌట కుమారులు గాన వీరలుఁ
జవ్వనమందు నుంట యిది ♦ సాజము లోకము పాడి యట్లుగా
కివ్విధి మార్పు గల్గుటకు♦ హేతు వదేమొకొ? చిత్రమయ్యెడిన్.

యోగీశుల కెఱుక పడని
బాగోగు లెసంగ. విద్ది ♦ వచియింపు ఘృణా
సాగర! నిన్నడిగెదన్
లోఁగడ నిను జూచినట్టు♦లుగ స్ఫురియించెన్. 79

తనకుం దానయి వెంట వచ్చెడిని యం♦త్రం బాత్మ కియ్యంబలెన్
గొనష్ట్రవేలంటక యున్నఁ దంతులవె వ♦ల్కున్ శ్రీహరీ! యంచు, ని
ద్దుర్మాగ కన్నప్పటినుండి నా యవయవం♦బుల్ సర్వముం బుట్టినాం
డను, నాతండ్రివి నారదుండవని పం♦డేహంబు గల్గెంగదే! 80

అనఁగా నత్యాదు నవ్వుచు నే నిట్లంటిని. 81

## * యువతి ప్రశ్నములకు నారదునుత్తరము *

అమ్మ! విషాద మందకు ద•యానిధి కృష్ణుఁడు మాధవుండు సౌ
ఖ్యమ్ములు నీకొసంగఁ గలఁ•డంచుకు నందియ మందఁబోకు నే
నిమ్ముగ దివ్య దృష్టిఁ గని • యెల్ల విశేషముల న్వచింతు స
త్యమ్ముగ నంచు నొక్క క్షణ•మాత్మ గ్రహించి యిటుల్వచించిరిన్.

అమ్మా! విను మిద్ది మహో
గ్రమ్మైనది కలియుగమ్ము • గాన సదాచా
రమ్ములు యోగమ్ములు సుత
పమ్ములు సర్వమ్ము మాలఁ • బడినవి తల్లీ! 83

జనములు దుష్ట కర్మములు•సల్పు చఘానురులై రి యెందుఁ గ
న్నను గపట స్వభావులై క•నంబడుచుండిరి తల్లి! చూడు స
జ్జనులు విషాద మందెద ర•సాధులు పొందెద రాత్మల న్ముదం
బును ధృతిగల్గి నిల్వఁబడు•పూరుషుఁడే బుధ వాచ్యుఁడయ్యెడిన్.

వినఁ గనఁ దాకం గూడని
యనేక పాపి తతి వృద్ధి•యై యేఁటికి నేఁ
డనయమ్ము బరువు పెరుగఁ గ
నినంతు వేతలలు విఱుగు • నమ్మా! భక్తీ! 85

ఇట్టి యికాలమం దెవ్వఁ•డేని యొకఁడు
గూడఁ గొడుకులతోడి నిన్•జూడఁ డమ్మ
కేరి కామాంధు లౌచు వే•క్షింతురు భవ
దాత్మజుల దాన శిథిలాంగు•లైరి వీరు. 86

బృందావనమున కరుదే
రం దారుణ్యంబు క్రమ్మ•ఱ నీకు మహా•

నందముగ నందగించె ము
కుంద చరణ భజన మింపుఁ ♦ గుందదు దేవీ! 87

బృందావనమ్మున భవ
న్నందనులను విడిచి వైచి ♦ నరులు సదా సి
న్నుం దమ యెడందలం దెల
విం దలపోసి భజియింత్రి ♦ మేయ గుణాఢ్యా! 88

కుందా! గోవిందా! యర
విందాయతనయన! సాధు♦బృంద ప్రణుతా!
వందారు సనందాది ము
నీంద్రా! నంద సుత! యిందిరేశ! ముకుందా! 89

అని బృందావనమున శ్రీ వృద్ధాదులు పాటలు పద్యం
బులు కీర్తనలు మున్నగువానిం బాడెదరు. 90

ఏయింటఁ జూచిన ♦ హే కృష్ణ! హే రామ!
హే హరీ! యనియెలుఁ ♦ గెత్తువారె
ఏవీధిఁ గాంచిన ♦ హృద్య వాద్యములతో
శ్రీహరి గానంబు ♦ సేయు వారె
ఏయుషన్నునఁ గన్న ♦ బృంద బృందంబులై
కృష్ణా! యటంచుఁ గీ♦ర్తించు వారె
ఏచోటఁ జూచిన ♦ నిందిరేశా! ముకుం
దా! యనుచు భజన మొ♦నర్చువారె.

ఎల్లెడల నూర్ధ్వ పుండ్రంబు♦లెల్ల యెడలఁ
దొలసిపేరు, లెల్లెడలను ♦ జిలుఁగు బిల్ల

కచ్ఛపములు బృందావన ♦ గ్రామ మెల్లఁ
దల్లిరో! భవత్ప్రియ రాజ♦ధాని గాదె. 91
తాకు వారిఁ దలఁచు వారు♦ లేక నీ కు
మారకులు జరా భారావి♦దూరులైరి
కొంచె మాత్మ సుఖార్థము ♦ కూర్కు చుండి
రంతియే యలందురకు మ♦మ్మా! యెడంద. 92

* పరీక్షిత్తు సల్పిన కలినిగ్రహ విషయము. *

ఇ ట్లేను బలుక నా సతి
యెట్లూ! యభిమన్యు పుత్రుఁ, ♦ డీ కలిగాఁ డీ
పాట్లు పడకుండఁ జెట్లకు,
గట్లకుఁ గట్టి పడవేసెఁ♦ గాదె సురముని! 93
నృపతి చేత బంధితుఁడై ♦ యీ దురాత్ముఁ
డెట్లో గప్పించుకొని చరి♦యించు చుండు
నఖిల నారి మెగితి మాయు♦మయ్యో? నయ్యా!
కృష్ణుఁ డీ యధర్మస్థితి ♦ నేటికోర్చె? 94
ఈ నా సందేహంబులఁ
బోనాడుము మిమ్ము్మవంటి ♦ పుణ్యాత్ముల వా
చా నిర్మలామృతంబుం
బానము సేసి సుఖియించు♦ వారము గామే? 95
అనుమాటల్ విని యప్పుడంటి నిటుల♦మ్మా! భక్తి నీ సందియం
బును బాపం గలవాఁడవిన్ము విమలాం♦భోజాక్షుఁ డా కృష్ణుఁ డే
దినమం దీ ధర వీడె నా దినమునం♦దే వచ్చినాఁ డల్ల సా
ధవముల్ పాడొనరించునట్టి కలి మ♦ర్త్యశ్రేణిఁ బీడింపఁగ!

ఉత్తరపట్టి దిగ్జయ ప♦మున్నతిఁ గ్రాలుచు నొక్కనాఁడు గో
వత్సముఁ దన్నుచున్న కలి♦ జాల్మునిఁ గాంచి యదేమి! క్రూర! నీ
కుత్సిత నుత్తరింతునని ♦ క్రోధముతో నసిపుత్రి నెత్తి వాఁ
డుత్తలఁ దత్తఱించి శర♦ణాచుఁ బదంబుల వ్రాలె దీనుఁడై. 97

అప్పుడు ఱేఁడు వాని జము ♦ నంతిక సీమకు నంపఁ బోక యీ
మెప్పియయున్న నేసుతప♦ముల్ ఘనయోగములున్నమాధులుం
దప్పక యీని సత్ఫలము ♦ తామరసాక్షుని కీర్తనంబున
న్జొప్పడు నంచు నీ కలి మ♦నుష్యులకై క్షమియించె నాతనిన్.

కలి యున్నపు డొకపరి నేఁ
జలజనయను కీర్తనంబు ♦ సల్పినఁ జాలన్
దలఁపఁ జిరకాల తపముల
నొలయని ఫలము సమకూరు ♦ నొక నిముసమునన్. 99

పూవు కందకుండఁ ♦ బూఁదేనెఁ గొసిమెడి
బంభరంబుపోలెఁ ♦ బార్థివుండు
కలి గతింపకుండఁ ♦ గలి ఫలంబులను గొ
సంగ నెంచె నెంత ♦ నైపుణంబు! 100

భృంగంబుపోలెఁ గలిపురుషుం డధీరులను బ్రమత్తులను బొంది యుండి బాధించుఁ గాని ధీరుల నప్రమత్తుల నేమి చేయలేఁ డని విష్ణు రాతుం డభిమన్యుతనయుండు కలిని స్థాపించెను. ఇఁకఁ బదార్థంబు లసారంబులైన తెఱంగు వినుమని యోనుభక్తి దేవితో నిట్లు పలికెను.

* పదార్థము లసారములైన తెఱఁగు. *

చద్దికనుల మిప్పులఁ ♦ జేయుచుండుట సార
మెల్ల మొదల నుండి ♦ పొల్లు వసితోఁ

బుధమిలోఁ బదార్థ♦ములు గింజలేని తు
షమ్ము లట్టులున్న ♦ వమ్మ నేఁడు. 102

కూటి కాసచేసి ♦ గుడిసె గుడిసె లోన
నరుని నరుని కడను ♦ బరమ భాగ
వతము గాథ ద్విజులు ♦ పఠియించ సాఁగి ర
ల్లగుట దాని సార♦మారి పోయె. 103

నాస్తికాధములు మ♦హా క్రూరకర్ములు
హింస్రకులును బాపు♦లెత్తి వచ్చి
యాక్రమించి యుండి♦రా కారణమ్మునఁ
దీర్థ సారమెల్లఁ ♦ దీఱి పోయె. 104

కల్లరీండ్రు వెచ్చ♦గాండ్రు ముంగోపులు
నావపోతులు పిసి♦నారి వాండ్రు
హీనులెల్ల వచ్చి ♦ యెగఁబడిరి లెవంబు
సార మందువలన ♦ మూరిఁ బోయె. 105

మనసు గెలువ లేని ♦ మందులు లోభులు
నికృతి పరులు వేద ♦ నిందకులును
శాస్త్ర హీనులు దన ♦ చాయకు వచ్చుట
ధ్యానయోగ ఫలము ♦ మ్లాన మయ్యె. 106

కన్ను మి న్నెఱుంగక నాతు ♦ కలసు గూడి
సుతులఁ బుట్టించుటకు మహా ♦ శూరు లంట
ముక్తి కన్య సాధింప న♦శక్తు లంట!
ధన్యులౌ త్యాగి! పాండిత్య సం♦పన్నులౌ త్యాగి! 107

సంప్రదాయాగతమగు వైష్ణవత యెచట
నైనఁ గలికమునకుఁ గూడఁ గానిపింప
దకట! యిల్లు ప్రళయము ముంచుకొని వచ్చెఁ
గాన వస్తుసారం బెల్ల కడలఁ జచ్చె. 108

అవ్వ! యిది యుగధర్మం
బెవ్వరి నన్న ఫలమేమి? యిది యింతే యటం
చవ్వనజాక్షుఁడు చూచుచు
నవ్వుచు నున్నాఁడు ప్రతి . . . నర్వక వజ్జ. 109

అనఁగ భక్తి యిట్టులనె ధన్యురాల నా
వంట వండి నీవు కంటఁబడితి
సాధు దర్శనంబు సర్వ సిద్ధికరంబు
గాదె లోకులకు జగత్పూజ్య! 110

ఆదృతి నీవు పల్కనుడు లల్లన వీనులఁ జేర్చి కాదె ప్ర
హ్లాదుఁడు గెల్చె దుస్త్యజము నచ్యుతు మాయ నదేల! నీకృపా
శ్రీ దయివాఁడఁ గాదె! వసిష్ఠ ధ్రువుఁ డుత్తమమైన స్థాన మే
నొందలఁ గేలు మోస్తు సకలార్థ విధాయక! మౌనినాయకా!

నారద! శారద నారద
దారద తార దర శారదా రద దేహా
దారద మారద యోగ వి
శారద సారద వచః ప్రసార దయాబ్ధీ! 112

అని భక్తిదేవి యేమేమియో పలికి నమస్కరించె నని
నారద మౌనీంద్రుండు సనక సనందన సనత్కుమార సనత్సు

జాతులకుం జెప్పెనని సూతుండు శౌనకాదులతో వక్కాణించెను. 113

**మంజుభాషిణి॥** నిగమాంతవేద్య! కమనీయ విగ్రహా!
జగదీశ్వరా! సకలశక్తి భాస్వరా!
ఖగ గోప వాహ! కలి కల్మషాపహా!
దిగధీశ మౌళి మణిదీప్త పాదుకా! 114

—: గద్యము :—

ఇది ఉభయ భాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ మందలి
భక్తి నారద సమాగమంబను
ప్రథమాధ్యాయము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## ద్వితీయాధ్యాయము.

శ్రీధారాళాదృతిగా
ధా! ధరణీధరవరేణ్య ♦ తల్పానల్పా!
సాధారణ్యేతర భ
క్తాధారాంఘ్రివనజాత ♦ హారిహారనాథా!

అవధరింపు, మవ్వల సూతుండు శౌనకాదుల కిట్లనియె, నారదుండు సనకాది మహర్షులతో మహాత్ములారా! పిదప వినుండు. నేను భక్తితో నిట్లంటి. 2

### * నారదుఁడు భక్తి నుద్బోధించుట *

ఏల వృథాగ వందురెద ♦ వింతటమాను మనంబులోఁ దలఁగ
శ్రీ లలనా మనోహరుని ♦ శేషశయానుని హైమచేలు ను
త్తాలభుజా చతుష్టయ సుదర్శన శంఖ గదాబ్జరమ్యు గో
పాలుభజింపు మాతఁడె శుభంబు లొసంగునడంచి దుఃఖముల్.

బాలిక! మున్ను కౌరవ సభాస్థలి సాధ్వి మహాపవిత్రఁ బాం
చాలినిదుష్టుఁడొక్కఁడు దుస్సాహసుఁడై చెయుచోఁ గలాద్బుచోఁ

బాలనముంబొనర్చిన కృ♦పానిధి యిప్పుడు లేఁడటమ్మ ? నీ
వేల దురంత చింతఁ దపి♦యించెద ? వా విభునిం దలంపుమా! 4

వంత మదేల నీకు ? వల♦వంతలఁ జిక్కి కృశించినారమా
కాంత! వరాభవింపకుము♦కావుము చూడుము పేర్మి, మ్రొక్కెఁగా
నెంతటివాఁడు నే నఱికు♦నే? కరముల్, హరి! యంచు గోపికా
కాంతలు వేఁడ శ్రీవరుఁడు♦ కావఁడె? యాతఁడు నేఁడు లేఁడటే?

అదియును గాక నీవు హరి ♦ కత్యధిక ప్రియభార్య, వాదయా
స్పదుఁడును నిన్నుఁ జూచుఁ దన♦ప్రాణముకన్నను మిన్నగా, భవ
ద్వదనమునుండి నే వలుకు♦వచ్చునొ ? దాసిని జేయు, నీవు పి
ల్చెదొ యతి నీచుసింటికిని ♦ జెచ్చెర శ్రీహరి వచ్చుఁ గాదటే! 6

“ జ్ఞాన వైరాగ్యములు ముక్తి ♦ సాధకములు
మొదటి మూఁడు యుగములలోఁ; ♦ బూజ్యరాలు
భక్తిదేవి యీ కలిని కే♦వలము తాని
బ్రహ్మసాయుజ్య మిచ్చెడి ♦ రాణిసుమ్ము ” 7

అనుచు నిశ్చయించి ♦ యానందచిన్మూర్తి
యా పరాత్పరుఁడు ద♦యామయుండు
హృద్యచరిత సుంద♦రిని గృష్ణవల్లభ
నిన్ను సృష్టి సేసి ♦ నిలిపెనమ్మ ! 8

ఒకనాఁడు శ్రీహరి♦[illegible]ద్ద నంజలిపట్టి
నిలిచి స్వామీ ! యేమి♦పలుపుదాన
నానతిమ్మంచు నీ♦వడుగ నాతండు మ
ద్భక్తులఁ బోషింప♦వలయు నిదియె

కార్యమంచును బలు♦కంగఁ జిత్తమటంచు
నాడితి వందుల ♦ కలరి యతఁడు
జ్ఞాన వైరాగ్యాఖ్య ♦ సూనుల ముక్తినాఁ
బడునొక్క దాసి నే ♦ర్పడఁగ నిచ్చి

భవ్య వైకుంఠ పురమున ♦ భక్తపోష
ణంబు నైజరూపమునఁ బో♦నర్చు కొనుచు
నవని భక్తులకొఱకు ఛా♦యా స్వరూప
మమరఁగా సృజించితివి నె♦య్యంబు మీఱ. 9

జ్ఞాన వైరాగ్య ముక్తులు ♦ సరసనుండఁ
బుకమిఁ దిరుగుచుఁ దొలుతటి ♦ మూఁడు యుగము
లమితమోదంబుతోఁ బుచ్చి♦తమ్మ! చీకు
చింత లేమియు లేక ♦ వసిద్ధి కెక్క. 10

కలిలోఁ బాషండ మత
స్థులు పీడింపంగ ముక్తి ♦ సుందరి తుఁయురు
క్కలిత యగుడుఁ బంపితివా
నెలఁతను మరలస్వకుంఠ ♦ నిలయమ్మునకుఁ. 11

ఎప్పుడయిన నీవు తలఁచి
నప్పుడు మాత్రమ్మె ముక్తి♦మార్గము మదిలో
నుప్పతిలఁగ వచ్చు మరల
నుప్పరవీదిఁ జనుచుండు ♦ నుదితాజ్ఞ మెయిన్. 12

జ్ఞాన విరాగాఖ్యుల న
త్యూనులఁ జెంత నిలుపుకొని ♦ చూచెదుకానీ

మానవు లుపేక్ష సేయుట
చే నిర్భుడు వృద్ధులైరి ♦ చేష్టలు నుడిగెఁ 13

ఐనను జింతిలకుమ యే
దైన నుపాయంబు చూత ♦ మంగన! కలినిఁ
బోనాడకు దీనికి పరి
హైనది యే యుగము కాద♦టంచు నెఱుఁగుమీ 14

అన్య ధర్మమ్ములను విడ♦నాడి యుత్స
వముల మున్నిడు కొని నిన్నుఁ ♦ బ్రతిగృహమునఁ
బ్రతి మనుష్యుని యందు స్థా♦పన మొనర్తు
నట్లు చేయునో హరిదాసుఁ ♦ డనకునన్ను 15

కలి నే జీవుఁడు నిన్నుం
గలియు నతఁడు ఘోర పాత♦కములు సలిపినఁ
జెలఁగుచు భయరహితుండై
యలముకొనుం గృష్ణ మంది♦రాంగణ భూమిఁ 16

ప్రేమ భక్తి యెవని ♦ హృద్వీధి నిలుచునో ?
యమలుఁడగుచు వాఁడు ♦ యముని గనఁడు
దైత్యదానవులును ♦ దయ్యముల్ భూతముల్
భక్తవరుని దాఁకి ♦ బ్రదుకలేరు 17

జ్ఞానమున నైనఁ గర్మముల్ ♦ సలిపియైన
శ్రుతులు చదివియైనఁ దపంబుఁ ♦ జొచ్చియైన
హరిని గనలేరు భక్తిచే ♦ నరయఁ గలరు
నాకు బ్రీ నెలంతలె బ్రమా♦ణమ్ము నమ్ము 18

ఇలలో సహస్ర జన్మం
బులు దాల్చినఁ గాని భక్తి ♦ పుట్టదెడందం
గలి భక్తియొ, కలిభక్తియొ,
కలిభక్తిం గృష్ణుఁ డెదుటఁ ♦ గంతులు వైచన్ 19

దుర్వాసో ముని సమధిక
గర్వంబున భక్తుఁ డిట్టఁ ♦ గా నేమయ్యెన్ ?
సర్వ ప్రభవిష్ణుండగు నీ
యుర్విన్ భక్తులను జెఱచు ♦ నెవ్వాఁ డైనన్ 20

చాలును వ్రతములు, మఖములు
చాలున్, దీర్థములు యోగ ♦ చయములు చాలు
న్నాలును జ్ఞాన కథావళి
పోలంగా భక్తి కొంకఁడె ♦ ముక్తి నొసంగన్ 21

భక్తి ప్రభావ మిట్టిది
ప్రాక్తన ఋషివర్యు లిట్లు ♦ భాషించిరి నీ
శక్తిని నీవు మఱచి దై
న్యోక్తులు పలికెద వొకింత ♦ యోచింపు మదిన్ 22

అనియీ సద్బోధిత స్వమాహాత్మ్య మాలించి భక్తి దేవి క్రమక్రమ ప్రవర్ధమాన సర్వాంగ పుష్టి సంయుక్తయై మహోల్లాసముతో నిట్లనె. 23

బళి! బళి! నారద! నీ యు
క్తుల వింటి ప్రమదము గంటి ♦ కూరిమి యిటు ని

శ్చలముగ నాపై నీకుం
గలదే! యిది మఱవ నెపుడు • గన్యుఁడవేపో. 24

ఓ త్రిజగన్నుత! సాధు చ
రిత్రా! నాబాధఁ ద్రుంచితివి • ద్రెంచితి, వింకం
బుత్రులు నిశ్చేతనులై
ధాత్రిఁ బడిరి వీరి నే పెంపవ్వారఁ దయన్. 25

అని భక్తి ప్రార్థించె నని సూతుండు శౌనకాదులతో నిట్లనియె!

### * నారదుఁడు వృద్ధుల మేల్కొల్ప యత్నించుట *

భక్తి సలుపునట్టి ప్రార్థన మాలించి
నారదుండు సద్ఘృణా పరుండు
కేలఁ దట్టివారి • నే లెండటంచు బో
ధన మొనర్ప సాఁగె • దాపు సేరి 27

లేరా! జ్ఞానా! లేరా!
వైరాగ్యా! లెండు లెండు • వడిగా నని య
వ్వారి శ్రవణ రంధ్రంబులఁ
జేరిచి నో రఱచెఁ జెవులు • చిల్లులు వడఁగన్. 28

ధనధాన్యంబులు వస్తువాహనములున్ • దారాత్మజాప్తుల్ సుహృ
జ్జనబంధుల్ మడిమళ్ళు గొడ్డులును గోదల్ మిద్దెలు న్మేడలున్
గనవిసర్వము నశ్వరంబె స్థిర మొక్కండైన లే దేల వీ
నిని బ్రేమించుట మోహమందుటయుఁ గన్ • మేల్గొమ్ము వైరాగ్యుఁడా!

నినుబీడించుచు దుఃఖపెట్టు ప్రజపై ♦ నీకేలరా మోహ మొ
య్యానఁగన్పించి క్షణంబులోనఁగనుచా ♦ టౌ వస్తుఁగోరుటా?
వనటన్నికయి నీవె తెచ్చుకొనుటా! ♦ వైరాగ్య! మేల్కొమ్మ ని
త్యనిరూఢంబగు వస్తువున్ వెదకి బ్ర ♦ హ్మానందముం బొందఁగన్.

ఎన్నఁడో వచ్చి కమ్ముకొని ♦ యుంటిమి నిన్ను నవిద్య దానిచే
నన్నవవాఁడనంచుఁగల ♦ దన్యమటంచుఁగలంకినంచు నీ
వెన్నకొనందొడంగితివి ♦ నీ! తెరఁజిమ్మి స్వరూపమారయం
గన్నను నీవెఱుఁగుకొనఁ ♦ గన్నులు దెర్వుము లెమ్ము జ్ఞానుఁడా!

చేరితి వేలరా? కటిక ♦ చీఁకటిలోన హృషీకమెద్దియుం
దూరని తావునన్ సుఖమొ? దుఃఖమొ? తోఁచనిగేమునన్ దమః
పారము ముట్టిపోడవున ♦ వస్థలదాటి స్వయంప్రకాశ రే
ఖారుచిరుండవయ్యెదవు ♦ గాక సుషుప్తిని వీడు జ్ఞానుఁడా!

దారవయియుండి యయ్యవాము ♦ తోఁ జెలికార తనువబ్బితస్థమై
మఱచితివంతనిన్నుఁ బది ♦ మందియు నైదఱలున్న పెద్ద తం
జరమునపై చిరావయిఁ బొ ♦ సంగిన విట్టి యవస్థలెల్ల నీ
మఱకువ మట్టిగాను కొఱ ♦ మాలిన నిద్దుర లెమ్ము జ్ఞానుఁడా!

కలవృద్ధివ్యాధినిగొండనెక్కిన భవ ♦ కాన్యయంబుఁగన్గొందు వా
వలఁగన్నుల్ దెఱవంగ మంచముతయిం ♦ బన్నుండి యేయుండు వ
క్కలలోఁగొండకునీకు నాదరువెదో? ♦ కన్గొన్న దెవ్వండో? యె
ట్టులో? యేకావునఁనుండి యో? యరయఁడో? ♦ స్తోత్రవరా జ్ఞానుఁడా!

కలలో వేఱుగనున్న నీదుతనువుం గన్గొంచు నున్నాఁడ వ
స్తులతోఁ గూడవా? ప్రాతిభాసిక జగత్తొక్కటంబలెంబా విభా
సిలు జాగ్రద్దశలోను నీపకలదిరా చిత్రంబు మాయాలస్థితిం
దెలియంగన్నులు విచ్చిమేలుకొను సుప్తిన్ వీడు లే జ్ఞానుఁడా!

చెన్నటి దేహబంధమునఁ జిక్కినఁ జిక్కితి కీడులోన మే
లన్నటు లీశరీరమెపలారిన యిప్పుడ దేవులాడు కొ
మ్మన్న పరమ్ము పిమ్మట రవంతయు లాభము లేదు నిద్రలం
గ్రన్నన నైహికంబులను గాలముఁ బుచ్చక లెమ్ము జ్ఞానుఁడా!

ధారుణినైన, ధర్మసముదాయము చే దివినైన నింద్రియ
ద్వారముచే లభించుసుఖవర్గము సత్యముగాదు వెండియుం
జేరుచు మాతృకుక్షి తరిఁ జీ! యిటుక్రిందికి మీఁదికాసులో
దారమునాఁ జరించెదవె కానది చాలును లే విరాగుఁడా!

అని యిట్లెన్నేని గతుల నారద భగవానుండు మేల్కొల్పు
పాడెను.

వేదాంత వేద గీతా
వాదంబులు పెక్కుమార్లు వచరింపఁగఁ ద
న్నాదంబులు చెవులం బడి
మోదించి కదల్చి రంగముల నెల్లెట్లో. 29

తనువులు కదలిన వంతే
కనులు దెఱవరావులింత్రుగాసిం బడి మొం
డిన కట్టెపుల్లలై యుం
డినవంగము లింక నెన్నటికి బలిసెడినో! 30

లులితంబులు ప్రాయంబులు
గలితంబులు రుధిర మాంసఖండగణమ్ముల్
పలితంబులు కేశంబులు
చలితంబులు గావె ప్రాణచయ మిట్టియెడన్. 31

అట్టి స్థితిలోనున్న జ్ఞాన వైరాగ్యులిద్దఱు మరలస్వాస్థ్య
పరాయణులు కాఁగా నారదుండు 32

అరరే! యేమిఁక నేమిచేయుదును సర్వారంభముల్ నీటి య
క్షరముల్ గాఁదొడఁగెన్, మహోగ్రతరమై తీవ్రమ్మై జరా నామ
దు,ర్భరరోగం, బటుపై నిగాఢతర నిద్రాదేవి పీడించు, ని
ద్దఱ, నిద్దురఁ బాపనేదియుఁ గద్దా? యొండుపాయంబిలన్

బిట్టఱచితిఁ జెవి చెంగటఁ
దట్టితిఁ గదలించితిన్ బదంబులు కరముల్
పట్టి తిగిచితిం జెవిమెలి
పెట్టితి గిల్లితిని గనులు విప్పరదేమో? 34

తూర్చి కరము తలక్రిందు
గూర్చుండం బెట్టఁ బ్రక్కకుం దల యొఱఁగున్
పర్వస్నాకల, దీఁకనా
నేర్పవయది లేదు వీరి నిద్దుర వారన్. 35

ఎటుమాదిన నాకుఁ దెలివుదోఁచద. ఇప్పట్టున నాకు
శ్రీహరియె దిక్కని వార్చి శుచినై హరిని ధ్యానించెదఁగా. 36

* వ్యో మ వా ణి *

వలదుమునీంద్ర! శోకము భ♦వత్కృత యత్నము పండనున్న దిం
దుల కెద సంశయింపకుము ♦ తోప మెలర్పఁగ నేతదర్థ ము
జ్జ్వల తరమౌ సుకర్మమును ♦ సల్పుము దాని నొనర్చ వైఖరిం
దెలుపఁ గలారు నీకు గడి♦దేఱిన సాధులు మాసిపుంగవుల్ 37

ఆ సత్కర్మము నీవుం
జేసెదవే క్షణములో న♦శింతువు పేదిం
గాసి పఱచు జరయు నిదుర
భాసుర భక్తియును దిగుగుఁ ♦ బడి దెస లందున్ 38

అని గగనవాణి పలుకఁగ
విని నాఁడను జెవులు దోర ♦ నెట్టి మహాతి న
ల్లనఁ గావివలువ మాటుచు.
మనము నిలిపి యెవఁడు దేవు♦మాయ నెఱుంగున్ 39

అంతట నే నమిత విస్మయ గోచర మానసుండనై
యిట్లు తలఁచితి. 40

ఇట్టులు వ్యోమవాణి వచి♦యించుటఁ యేటికో? గోపనంబు గా
నట్టి సుకర్మ మెయ్యదియొ? ♦ యయ్యది నా కెవరాన తిత్తురో?
యట్టుగ నేను దాని సలు♦పన్ మఱి పీరల నిద్రవాయునా?
యెట్టి విచిత్రముల్ జరుగు! ♦ నీశ్వరు లీల లనేక వైఖరుల్ 41

అని పెద్దయుం బ్రొద్దు విచారించి యవ్వల నవ్వా!
వింటివిగదా! యీఱసిల్లుము, ప్రతీక్షించు చుండుము, అని యే
నవ్వారల నచ్చటన వదలి తదర్థంబై ప్రతి పుణ్య తీర్థంబున

కరుగుచుఁ గంటంబడిన ప్రతి మునీంద్రు నాకాశవాణి చెప్పిన
సత్కర్మ సాధనంబు నడుగుచుఁ దిరుగు చున్నాఁడ. 42

ఒక్కఁడు కనువిప్పి ♦ చక్కఁగా నాలించు
నొక్కఁడు ప్రేలుచు ♦ ముక్కుపైని
ఒక్కఁడు కడచూపు ♦ నుప్పరం బెగయించు
నొక్కఁడు నాలుగు ♦ దిక్కులుగను
ఒకఁడేమి పలుకక ♦ యుర్వి చూచుచు నుండు
నొకఁడు కాలికొలంది ♦ నోసరిల్లు
ఒక్కఁ డర్థము దీని ♦ కున్నదే? యని పల్కు
నొకఁ డసాధ్యపుఁ గర్మ ♦ మోయి యనును
ఒకఁడు నారదా! నీయంత ♦ యోగివరుఁడె
తెలియ లేఁడేని మే మఱే ♦ తెలుపువార
మంచుఁ గేల్మోడ్చు. మఱియొక్కఁ ♦ డరుగవయ్య
బదరికా వనంబున కంచుఁ ♦ బలికి పోవు. 43

ఇంతట నంతటఁ బడి జగ
మంతయు నీ వార్త ప్రాఁకె ♦ హాహాకారా
క్రాంతము లయ్యె సమస్తా
శాంతంబులు దిక్కు దోఁప ♦ దాయె నెవరికిన్ 44

ఎంతటి వింత శ్రుతులు వే
దాంతంబులు గీతగూడ ♦ నచ్చట నిద్రా
కాంతిఁ దొలఁగింపవో యుపా
యాంతర మింక లేదటంచు ♦ నాడిరి జనముల్ 45

సామాన్య స్వాభము గా
దీ మనుజులఁ బుట్టుకొన్న ♦ దిది యెట్లగునో
దామోదరుఁ డే సుకృతిఁ
భూమిని నెలకొలుప నిట్లు ♦ పుట్టించెనొకో! 46

సదయ మతులార! యిట నట
మెదలిన లాభంబు లే ద ♦ మేయ తప స్సం
పదల నిది యొదవఁ గదిసెద
బదరీ వనము న్మునీంద్ర ♦ వరసేవనముఁ 47

అని తలంచి తద్దర్శనాభిలాషంబుగం బయనించినతోడనే.

* నారదుఁడు సనకాదుల నుపాయ మడుగుట *

మునివర్యులార! మీ దరి
సెన మస్మద్భాగ్య వశము ♦ చేత లభించెఁ
జని ధన్యం బయ్యెను స
జ్జన సందర్శనము రిత్త ♦ సాఁగ దెఱుఁగుదురు. 49

నాలుకపై న ర్తించు
న్నాలుగు వేదములు, యోగి♦నాథులు తమ పా
దాలకడ వ్రాలుదురు ధీ
శాలిత్వము నందు మీకు ♦ సాటి యెఱుంగఁ 50

ఐదేండ్ల ప్రాయమే సృ
ష్ట్యాదిం బుట్టినను మీకు, ♦ ననవరతము కా
లా డిష్టయయ్యు దరియఁగ
రాదు జరాదేవి హరి శ♦రణ్యుల మిమ్ముఁ. 51

హరి లోకమున వసించుచు
హరి నామామృతము జుర్రు ♦ చత్యంతము శ్రీ
హరి లీలల వీక్షించుచు
హరి కథలన్వినుచుఁ దన్మ♦యతనుండు బళీ! 52

హరివాకిటి జయ విజయులె
హరిమీ భ్రూభంగమాత్ర♦మున లబలబ లా
డి రిలంబడి రవల భవ
ద్వరకరుణఁ జేసుకొనిరి ♦ వైకుంఠంబుల్ 53

ఎంతటి వింత! వింటిరె? ము♦నీశ్వరులార! యనూన వేద వే
దాంతములే ప్రబుద్ధులగు ♦ నట్టులు జ్ఞాన విరాగు సల్ప వే
నంతకు మించి యేది గల♦దయ్య సుసాధన? మట్టి దాని నా
స్వాంతమదెన్ని రీతుల వి♦చారము సేసియుఁ గానదయ్యెడిన్ 54

పెద్దలకెల్లఁ బెద్దలరు ♦ నెన్నని నచ్చిన వారు మీరు, మిన్
సుద్దుల నాలకించి దయఁ ♦ జూడరె జ్ఞాన విరాగు లేగతి
న్నిద్దుర లేచి యెల్లెడల ♦ నిల్చెద, రల్ల సుకర్మ మేది? నే
వద్ది యెటుల్ పొనర్తు? దమ♦ రానతి యీరె దయాంతరంగులై.

అన విని సనకాదు లిట్లనిరి. 56

* సనకాదులు నారదునకు సుసాధనము నుడువుట *

వలదు విచారము మదిలో
నెలమింగను ధైర్యమూను ♦ ఋషివర్యా! యిం
దులకుం దగిన యుపాయము
కలదయ్యా! యిదివఱకె సు♦ఖ సుసాధ్యంబై. 57

బళిరే! నారద! పుణ్యవంతుఁడవు శ♦శ్వత్సాధు వైరాగ్య వం
తులలోనం దల మానికంబవు, సుధాం♦ధోవర్గమేయేల? యో
గులు పందేహము దీర్చి కొందురు నినుం♦ గొండాడి శ్రీకృష్ణ భ
క్తుల నీవే ప్రథమాభిగణ్యుఁడ వెఱుం♦గున్మన్మనః పద్మముల్ 58

భక్తికొఱకుఁ బాటు ♦ పడు నీవు నబ్బుర
మందు పనులు లోక♦ముందుఁ గలవె?
యెట్టులైన భక్తి ♦ నిల స్థిరంబుగ నిల్పఁ
దలఁచు చుంద్రు కృష్ణ ♦ దాసవరులు. 59

యమివర్యుల్ ప్రకటించిరీ ధర ననే♦కాధ్వంబు, లన్నెల్లయుఁ
శ్రమసాధ్యంబులె. యట్టులయ్యు నవి స్వ♦ర్గంబె ప్రసాదించు. ను
త్తమ వైకుంఠమునిచ్చు మార్గమతి గు♦ప్తం బయ్యె, యీదీనిబో
ధము చేయంగలవాఁడు చిక్కుటయునీం♦ద్రా! యెంత భాగ్యంబొకో.

మును వ్యోమవాణి వెలువఱ
చిన సత్కర్మమ్ము నిపుడు ♦ చెప్పెదము భవ
న్మనమును స్థిరముగ నిలిపితె?
యనఘా! బుద్ధియుఁ బ్రసన్న♦మై యున్నదియే? 61

వినుము. ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞము యోగయజ్ఞము స్వాధ్యాయ యజ్ఞము జ్ఞానయజ్ఞము మున్నగునవి కర్మ విసూచకమ్ము లెన్నియేనియుం గలవు. 62

అందు సత్కర్మ సూచకం♦ బైన జ్ఞాన
యజ్ఞ మా శుకాదులు పాడి ♦ నట్టి భాగ
వత పురాణ కథాను లా♦పమ్మ యంచు
నఖిల దర్శనుల్ బుధు లందు♦రయ్య నిజము. 63

భక్తి జ్ఞాన విరాగుల
శక్తి తదుద్ఘోషమునను ♦ సమధిక మగు నా
వ్యక్తులకుఁ గష్ట సుఖములు
భక్తివలనఁ గలుగునయ్య ♦ బ్రహ్మ కుమారా! 64

సింగమ్ము బొబ్బవెట్టం
గం గోకములు పరువెత్తు ♦ కైవడిఁ బరువె
త్తుం గలిదోషము లెల్లన్
ఖంగున భాగవత రవ మొ♦గసి చెవిఁ దూఱన్. 65

అపుడు ప్రేమ రసావహ ♦ మైన భక్తి
జ్ఞాన వైరాగ్య సుతులను ♦ జంక నితికి
వడిగ నింటింటికిని వచ్చి ♦ ప్రతి మనుష్యు
తోడఁ గ్రీడించుఁ దనయూడు ♦ జోడు లేక. 66

అని సనకాదు లాదరంబున జ్ఞాన వైరాగ్యు లుత్థితులగు తెఱఁ గెఱిఁగింప. 67

ఆపై నారదుఁ డిట్లు పల్కె మును లా♦రా! వేద వేదాంత గీతా పాఠంబుల నెంత తెలిపినను సి♦ద్రల్ లేవరై రప్పుడీ పాటుల్, భాగవతంబులోనఁ బ్రతి శ♦బ్దంబందు వేదార్థమే దీపించుం గద సిద్ధమాత్ర మోటు సు♦త్తిం బాతుకే తద్ధ్వనిన్.

సత్సాధులు శరణాగత
వత్సలు లవ్యర్థభవ్య ♦ వచనులు మీరే
తత్సమయమ్మునఁ దీర్పుఁడు
మత్సంశయములను సుగుణ ♦ మండనులారా! 69

* సనకాదు లెట్లు భాగవతము మిన్నయో సుడువుట. *

అని పల్కఁ గుమారు లిట్లనిరి. 70

వేదోపనిషత్సారా
పాదిత మగుటఁ జుమీ భాగ♦వత ముత్తమ రే
ఖా దీపితమయ్యె ఫలో
త్పాదనముం గూడ వేఱు ♦ పడియే యుండున్. 71

క్షీరస్థిత ఘృతంబు ♦ చేతి కందదు పృథ
గ్భూతమై సురలకుఁ ♦ బుష్టినిచ్చు
చెఱకు గడలలో వ♦సించుఁ జక్కెర దాని
వెలువ రించిన నది ♦ ప్రీతినిచ్చు
త్రావంగఁ జేతి కం♦దదు గాని సార మా
మూలాగ్రముగ శాస్త్ర♦ములఁ దనర్చు
నా రసం బెటులైన ♦ వేఱు చేయుదుమొ వి
శ్వ మనోహరంబైన ♦ ఫలము నిచ్చు
వేదసార మిల్లఁ ♦ బిడిచి పిడిచి సిద్ధ
పఱుపఁ బడినదయ్యె ♦ భాగవతము
కాన వేద మీయ ♦ లేని ఫలంబును
భాగవత మొసంగ ♦ వలఁతి సుమ్ము. 72

జ్ఞాన భక్తి విరాగాభి ♦ ధానులను స్థి
రంబుగా భూమి నిల్పు కా♦ర్యంబు కొఱకు
బ్రహ్మ సమ్మితంబైన యీ ♦ భాగవత మ
హా పురాణ సారము చెలు♦వారె నయ్యె. 73

అనవద్యశ్రుతులందుఁ బంకులిడె వేదాంతంబుఁ దూర్పాఱఁ బ
ల్కైను గీతాసిద్ధి లేవనెత్తె. మఱి యట్టిం డయ్యు నా బాదరా
యణుఁ డజ్ఞాన మహాంబురాశిఁ బడి యిట్టట్టై పరీతాప పీ
డనముల్ వొందఁగ నివైకారణ మశోకం గాంచెనో నారదా!

మఱచితివయ్యా నీవు మును ♦ మహానుభావుండు పరాశరాత్మజుం
డఱిముఱిఁ జెందఁ శ్రీహరి దయాసింధు విశ్వవిభుఁ బరాత్పరుఁ
గుఱిచి రచింపు గ్రంథమని ♦ కూర్మిఁ బ్రబోధము సేసినాఁడ వ
త్తఱి రచియింపఁబడ్డది గదా యది భాగవతంబు నారదా!

దాని రచించి నంతనె కదా ముని సర్వ శుభంబు బొందె న
ద్దానికిఁ గారణుండవయి ♦ దానిని గూర్చి యదేల విస్మయం
బూనెదు? ప్రశ్నవేసెదవు ♦ యోగివరేణ్యా! సమస్త దుఃఖముల్
వోనడపంగ భాగవత ♦ మున్నదవయ్యా విచారమేటికిన్? 76

అని సనకాదులు నొక్కి వక్కాణింప నారదుండు
హృష్టాత్ముండై యుల్లసిల్లె. 77

మనుజుం డెన్ని సహస్ర జన్మముల సంపాదించు పుణ్యంబు చే
తనో కాని సమకూరఁ బోవ దల సత్సాంగత్య, మద్దాని పొ
ల్పున నజ్ఞాన నిదాన మోహమదతృట్‌లోభాంధకారంబు నా
శనముం బొందఁగ జ్ఞానభానుఁడు మనస్సాంద్రంబుపై కెక్కుసిన్.

అతి దుఃఖాకర సంసృతి ప్రబలదా ♦ వాగ్ని స్ఫురత్కీలికా
తతిచే మాడెడి వారికిన్ ఘన భవత్సాన్నిధ్య భాగ్యంబు వి
శ్రుత మాంగల్యముఁ గూర్చు బీజమనుదున్ మున్ శేషగీతానుమో
దితులారా! భవదీయసత్కరుణ సంస్థింతు స్వస్థుండనై. 79

అధిముఖోత్కర్షనములు
సాధీయ స్తాత్త్వికోక్తి ♦ సవిమర్శనముల్
బోధనుధాస్వర్శనము ల
సాధారణ సాధులోక ♦ సందర్శనముల్. 80

మావంటి సంశయాత్ములఁ
గావంగాఁగాక యేమి♦గావలెనని మీ
రీ వసుధఁ దిరిగెదరు ? మీ
జీవితము పరోపకృతికి ♦ స్థిరపడిపోయెన్. 81

అని నారదుండు సనకాదులం గొండాడెనని సూతుండు శౌనకాదులకుం జెప్పెను. 82

తోటకము. ధరణీ తరుణీ సుఖ ♦ దాన చణా !
కరుణా వరుణాలయ ♦ కమ్రగుణా !
పరమాదర మాసిత ♦ వైశ్రవణా !
వరదా పురదానవ ♦ భంగరణా ! 83

—: గద్యము :—

ఇది ఉభయ భాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ మందలి
భక్తి నారద సమాగమం బను
ద్వితీయాధ్యాయము.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## తృతీయాధ్యాయము.

శ్రీమహిత ధరోదిత క
న్యా మందస్మేర భాసు♦రామలగండ
శ్రీముకుర ఫలిత మృదుదే
హా! మథితాసుర సమూహా ♦ హరిహరనాథా!

అవధరింపు మవ్వేల సూతుండు శౌనకాదులతో నిట్లనియె. అట్లు నారదుండు సనకాదులం గొండాడి మఱియు నిట్లనియె. 2

శుకశాస్త్ర కథాలలిత
మ్మకలంకము జ్ఞానయజ్ఞ ♦ మఱియత్నముతో
నీకుఁ జేయుదు మునులారా!
ప్రకటింపఁగ జ్ఞానభక్తి♦వైరాగ్యములన్. 3

జన్న మెటం బొనర్తు! శుక ♦ శాస్త్ర మహత్త్వపటుత్వ మెద్ది? యే
నెన్నిదినాలు భాగవత ♦ హృద్యకథావళి నాలకింతు? నే
మున్నది యో విధానము స♦ముత్సుకతం బొనరింప? నాకు నీ
యన్నియుఁ దెల్పరయ్య నిగ♦మాకృతులార! నమస్కరించెదన్. 4

